# హిందూమతము
# ప్రధాన సందేశము.

గ్రంథకర్త:

బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ;

'వివేకానంద' 'రామతీర్థాది' జీవితగ్రంథకర్త.



ప్రథమముద్రణము 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1936.



వెల రు 0—2—0.

# హిందూమతలక్షణము.



(1) హిందూమతము, వ్యక్తులపైఁ గాక, బుద్ధీంద్రియాతీతదృష్టిలో దర్శింపఁబడిన శాశ్వత సత్యధర్మములపై నాధారపడియుండుటచే నెన్నటికిని చావులేని మతమైనది.

(2) అనేకములగు ఉపాధిభేదముల ననుసరించి, ఒకే వ్యక్తియొక్క భిన్నజీవితదశల ననుసరించి, అందఱ కన్నిసాధనములు చూపుమతమగుటచే, హిందూమతము విశ్వవిశాలమతము.

(3) ఈశ్వరారాధనవిషయములో వ్యక్తులకు సంపూర్ణస్వాతంత్ర్య మంగీకరించి, ప్రోత్సహించుటచేతనే, ప్రేమపూర్వక భిన్నమతసహానభా

వనము, భారతజాతీయ జీవితవిధానముగా వ్యా
పోయినది.

(4) ఎవరిమతము చెప్పినధర్మసాధనములను వారు
తెలిసికొని, నిశ్చయదీక్షతో నాచరణలోఁ బెట్టి
నచో సిద్ధి లభించునని చెప్పుటచే హిందూమ
తము, మతముపేర "మానవవిక్రయము" చేయు
ట ఘోరదోషమని వక్కాణించును.



# విజ్ఞాపనము



ప్రపంచములోని అన్నిమతములలోఁ బ్రాచీన
తమమైనదే హిందూమతము. హిందూజాతి నిష్క
ళంకమైన స్వాతంత్ర్యప్రభలతో దేదీప్యమానమై
వెలుఁగొందినపుడు హిందూతత్త్వజ్ఞుల మహోన్నతా
దర్శములు దేశదేశాంతరముల వెల్లివిరిసినవి. నేటి
కిని భారతజాతి పరాధీనజాతియై, దాస్యబాధము
లలోఁబడి మ్రగ్గుచున్నను, భారతధర్మమగు వేద
వేదాంతములకుఁ బరాధీనత రాలేదు. ఖండాంతరము
లందలి సత్యాన్వేషకులు, ధర్మారాధకులు, జీవిత
పరమార్థములగు అనంతశాంతిసౌఖ్యముల సాధించు
తరణోపాయముకొఱకై, వెదకివెదకి, తుదకీపవిత్ర
భారతపుణ్యభూమికే వచ్చి తృప్తి చెందుచున్నారు.

జాతులకు, సంఘములకు సమస్తరంగములలో దివ్య సామరస్యము చేకూర్పఁగల పరమోత్తమధర్మములు, సూత్రములు, హిందూమతములో నున్నవని యిప్పు డిప్పుడే స్వజాతీయులు, విజాతిసోదరులు పెక్కుఱు గుర్తించుచున్నారు.

ఆర్థికరాజకీయరంగములలో మనకు సంభవించిన దాస్యమునకు, దారిద్ర్యమునకు, విలపించుట సహజమే కాని, ఆత్మవిశ్వాసమంమును, ధార్మికస్థిరత్వము నందును, మనజాతికి సంభవించిన దాస్యదారిద్ర్యములకు, మనము విలపించుటయే కాదు, గుండెలు బ్రద్దలగునట్లురోదనముచేయవలసియున్నది. జాతులు నిత్యములై నిలచుటకుఁ గాని, నీరసించి నశించుటకుఁగాని, ముఖ్యకారణములు రాజకీయార్థికములు కావు. ఒకప్పుడు రాజకీయార్థిక మహోన్నతశిఖముల నాట్యమాడినజాతులు, నేఁడు చరిత్రావ

శిష్టములై యున్న సంగతి జగద్విదితము. నేఁడైన, ఐహికైశ్వర్యములు కుప్పలు కుప్పలుగాఁగల జాతులలో శాంతిసౌఖ్యములు లోపించుటయేకాక, పశుత్వము, రాక్షసికత్వము, రాజ్యము చేయుచుండుట కూడ మనము దినదినము నిరీక్షించుచునే యున్నారము. దీనికిఁ గారణములరయుట కష్టముకాదు. నాగరికతాసౌధము బీటలుదీసి, మూలమట్టముగాఁ గూలిపోకుండ నిలఁబడవలెనన్న, సుస్థిరమగు ఆత్మధర్మమనుపునాదిపై నిర్మింపవలెను. యుగాంతరముల నుండి హైందవనాగరికత అట్టి దివ్యాధారముపై నిలిచినది. వేదవేదాంతధర్మాచరణమే ఆపునాది. అట్లని హిందూమతము భౌతికభోగభాగ్యరంగములలో దాస్యము నంగీకరించి నిద్రించుమని చెప్పుచున్నదని తలచుట ఘోరదోషము. "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మిభరతర్షభ" యని శ్రీకృష్ణ

భగవానుఁడు చెప్పినట్లు, భోగభాగ్యములన్నియుఁ బరమార్థదర్శనైకోపకరణములని గుర్తించి ప్రవర్తిం చుటే హిందూమతప్రధానసందేశము. ఆధ్యాత్మిక స్వాతంత్ర్యపతాకమును సమగ్రసాహసోత్సాహములతోఁ బ్రేమప్రహస్తములతో నెగురవేయఁ గలజాతికి, రాజకీయార్థిక దాస్య శృంఖలములు తమంతట తామే తుత్తునియలై రాలిపోఁగలవు. అందుచే మనజాతీయ దాస్యమునకుఁ గారణము మన ఆత్మవిశ్వాసదారిద్ర్యమే యని చెప్పనవసరము లేదు.

జాతీయపునర్నిర్మాణమునకు హిందూమత మొసగు మహోన్నతాదర్శముల గౌరవించి, అచంచలాత్మవిశ్వాసమును పెంపొందించుకొనుటయే ప్రథమసాధనము. హిందూమతమును, అందలిభిన్న శాఖా శాఖాంతరములను, సంపూర్ణ సమన్వయదృ

స్తితో బరిశీలించి, విశ్వవిశాలములగు
మహాసందేశముల నర్థముచేసికొనుట సు
ముకాదు. ఈచిన్నిపొత్తమును ప్రకటిం
యుద్దేశము పండితులకు హిందూమతము
చుటకుఁగాదు. హిందూమతములోని కొ
సందేశములను పామరజనకోటి కందఁజేం
యుద్దేశము. నేను పండితుఁడనుకాను. కాని
జూపిన హిందూమతాభిమానలేశమును
సోదరీమణులు గ్రహించి, భారతధర్మాభి
చో నేను కృతజ్ఞుఁడనగుదునని నిశ్చయము
చుచున్నాను. ఈశ్వరాశీర్వాదమున్నచో
ము లే యింకను వరుసగా (Series) ప్ర
ప్రజాసామాన్యమున కందఁజేసి, వేద
ధర్మము నాకుఁ గల్గించినఆత్మజ్ఞానఋణము
కొనుటకు యత్నించెదను. గ్రంథప్రకటన

ములోఁ జేయూతనొసగిన యువకుఁడు, భారత ధర్మసేవాదీక్షాపరతంత్రుఁడు నగు శ్రీగోకరాజు శ్రీరామరాజునకు వందనసహస్రములు.

గ్రంథకర్త.



# విషయసూచిక.



## I సత్యాన్వేషణము.

# హిందూమతము

## ప్రధాన సందేశము.



### సత్యాన్వేషణము.

భరతవర్షము ప్రపంచమునకు మహాసందేశము నీయవలసి యున్నదని పెక్కురు భారతీయులు, ఖండాంతరులు కూడ గుర్తించియున్నారు. భారతజాతికి మతమే ప్రధానలక్ష్యమనుసంగతి అందఱకుఁ దెలిసినదే. భారతజాతికిఁ జెందియున్న మతము హిందూమత మని నేఁడు పిలువఁబడుచున్నది. భారతసందేశమనగా హిందూమతసందేశము. భారతమతమునకు హిందూమత మన్నపేరు దేశాంతరులు పెట్టినది. 'హిందూ' అను పదము 'సింధు' పదమునుండి

వచ్చినదే. ముసల్మానులు మన దేశముపై దండ యాత్రకు వచ్చి, సింధునదీప్రాంతముననున్న భారతీయులను జూచి హిందువులని పిలువఁజొచ్చిరి. హిందువుల మతము హిందూమతమైనది.

భారతజాతి మతమునకుఁ బేరు లేదు. సర్వసృష్టి కాధారభూతమై యున్నధర్మమే మన మతము. ఆ ధర్మము నిత్యమైనదగుటచే సనాతనధర్మమని పిలువ వచ్చును. ధర్మమనగా లోకమును ధరించునది. సనాతన మనగా శాశ్వతమైనది. ఈ సనాతనధర్మ మొక వ్యక్తిపైఁగాని, ఒక సంఘముపైఁగాని, ఒక ఆలయ నిర్మాణముపైఁగాని, ఆధారపడియుండలేదు. ఈశ్వరధర్మమే సనాతనధర్మము. ఈ పరమధర్మము ఒక జాతికి, ఒక దేశమునకుఁ జెందదు. ఇది ప్రకృతి ధర్మము. ప్రాణికోటికంతకుఁ జెందినధర్మము. కాని; ఒక్క భారతజాతి యీధర్మమును పరిపూర్ణముగా

గుర్తించి, యుగాంతరములనుండియు నానాదేశము
లకు, నానాజాతులకు బోధించినది. ఈ దివ్యసత్య
మును మఱల నేఁ భారతీయులు గుర్తించి తమ
జీవితములలో నాచరించి, అశాంతిమహారోగపీడిత
మగుచున్న లోకమునకు బోధించి, శాంతి చేకూర్ప
వలసియున్నది.

## హిందూమత మొక మతమా ?

అనేక పరస్పరవిరుద్ధ సిద్ధాంతములను చెప్పును
గాన హిందూమత మొక మతముకాదని మతాంత
రులు, మతాంతరులు చెప్పునదే సత్యమని తలలూపు
స్వజాతిసోదరులు వక్కాణించుచున్నారు. నిజమే.
హిందూమత మొకమతముకాదు. హిందూమతము
సర్వమతనిలయము. దేవునిఁగూర్చి, జీవునిఁ గూర్చి,
జీవేశ్వరుల పరస్పరసంబంధమును గూర్చి మానవ
కోటి కూహింప సాధ్యములగు సిద్ధాంతములు, అఖి

ప్రాయములు, వేదవేదాంతములలో ననంతస్ఫుర ద్రూపములతో వర్ణింపఁబడియుండుట కానఁగును. అందుచే సర్వమతములలోని సమస్తసిద్ధాంతములు, హిందూమతములో నఖండ ప్రజ్ఞాప్రకాశముచే క్రోడీకరింపఁబడి, సమన్వయింపఁబడి యున్నవి. అందుచే హిందూమత మొక మతము కాదు. అది సర్వమత సారామృతము, అందుచే విశ్వజనీనమతము. హిందూమతమున లేని మతసిద్ధాంతములు మఱేమతమునను లేకపోవుటయే కాక, హిందూ మతము దైవానుభవ సాహసములతో నొక్కి వక్కాణించు కొన్ని సిద్ధాంతములు మఱేమతమునను మందున కైనను గానరావు.

## జీవకోటి—ప్రధానసమస్య.

ప్రాణికిఁగల సమస్తసమస్యలలోఁ బ్రథమమైనది, ప్రధానమయినది, అత్యుత్తమమైనది, అత్యున్నత

మైనది, జీవార్థసమస్యయే, అనగా సృష్టిరహస్యస
మస్యయే. ప్రతిప్రాణికి అనంతమై, అప్రతిహతమై,
అవిచ్ఛిన్నమై, అతిసహజమగుకోరిక యొకటున్నది:
విశ్వసృష్టికి హేతుభూతమగు సత్యము (Truth)
నెఱిఁగి, అనుభవపూర్వకముగా గ్రహించుటే సర్వ
జీవకోటికిఁ గల నిత్యవాంఛ. మతమనఁగా సత్యాను
భూతి (Realisation of Truth) యనియే
హిందూతత్త్వశాస్త్రములు నిర్వచించినవి. మత
మన ఒకసిద్ధాంతముకాని, ఒకనమ్మకముకాని, ఒక
గుడికాని, గోపురముకాని, ఒక విధికాని, ఒక గ్రంథ
ముకాని, కాదు. ఆత్మజ్ఞానానుభవమే మతము.
తత్త్వశాస్త్రము సత్యమునెఱుఁగు మార్గమును
జూపును; ఆచూపినమార్గమును చేపట్టి పరమావధి
నిఁజేరుటేమతము. తత్త్వనిర్ణయము, అనుష్ఠానము;
సిద్ధాంతము, అనుభవము రెంటినొకేదృష్టిలో సమ

న్వయించి చూపునదే హిందూమతము. వేదములు, ఉపనిషత్తులు ఉపాతీతదృష్టికి లభించిన దర్శనములే కాని, పండితులచే నూహించి, వ్రాయఁబడిన గ్రంథములుకావు. మానవుఁడు, తనపరిమితిగల ఇంద్రియ బంధములనధిగమించి, సర్వబంధాతీతమగు సత్యదర్శనముచేఁ జ్ఞానుఁడై, పరిపూర్ణుఁడై, బ్రహ్మర్షియై, ఈశ్వరుఁడై ప్రకటించిన దివ్యధర్మముల సంపుటీకరణమే హిందూమతము.

## జన్మవిచారము.

మానవుఁడు పుట్టి, పెరిగినవెనుక లోకములో ననేక సందర్భములు పరికించును. ప్రతిసందర్భము సంశయములపుట్టయై బుద్ధినెదుర్కొనును. కొన్ని విషయములు మానవునికి సంతోషము నొసఁగును; కొన్ని భయమును బుట్టించును; మఱికొన్ని ఆతని దుఃఖాబ్ధిలో ముంచివైచును. ఈసంశయ మహా

వాయువు వీచినంతనే, మానసాందోళనము బయలు దేరును. వెంటనే చూచువస్తువుల సత్యాసత్యము లను గూర్చి ప్రశ్నలు, తర్కములు ఉద్భవించును. ఏవిషయమును గూర్చి తర్కించుట కారంభించినను, ఆద్యంతములుకన్పట్టవు. పరిమితిగల బుద్ధితో విషయ విమర్శ చేసినకొలంది, అపరిమితమగు నొక ఊహా తీతరంగమున కీడ్చుకొనిపోవును. అచ్చటబుద్ధి, ముం దుకుం బోవుశక్తి లేక, సంశయములుతీరు సాధనకన్ప ట్టక, తుదిలేని అసంతృప్తి పంకిలమునంబడి, శాంతికై తహతహలాడును. వివిధవిషయములను గూర్చిన వివిధప్రశ్న లొకప్రశ్నగా మారును. "ఈకన్పట్టు విశ్వసృష్టికర్తమేమి ? దీనిసత్యస్వరూపమెట్టిది ? నే నెచ్చటనుండి వచ్చితిని ? నేను శరీరమా ? లేక జన మరణాతీతమగు నేదైనశక్తి నాలోనున్నదా ?" ఇదే మహాసమస్య. ఈసమస్య పరిష్కారమగువఱ

కును శాంతి లేదు. కాని యుక్తికోసమాత్రముననే పరిష్కారమగు సులభసమస్యకాదు.

### నిత్యానందవాంఛ.

ప్రతిప్రాణియుఁ గోరునది నిత్యానందము. దుఃఖ సమ్మిశ్రితముకాని, అవ్యయమగు నానందమే వల యునది. కనుఱెప్ప విప్పుకాలములోఁ బుట్టి మర ణించు నత్యల్పక్రిమి మొదలు, పంచఖండముల నేలు చక్రవర్తివఱకుఁ జేయుప్రతికార్యమునకు, వేయు ప్రతి అడుగునకుఁ బరమోద్దేశము, ఆనందతృష్ణయే. ప్రగానికి గుప్పెడు బియ్యముతోఁ బూటకపైన చ్చిన ఆనందించునట్లే, కోటీశ్వరునకు రెండులక్ష లాభమువచ్చిన నానందించును. భిక్షాధిపతికి ప్పెడు బియ్యము లభింపనిచో నేడ్చునట్లే, లక్షా తి నాలుగూకలు పోయిన పలవించును. అంద కు వలయునది అడ్డులేని ఆనందమే. ఆనందము

నచ్చుట ఎట్లువెనుకవలయునో మాత్రమే మనకుఁ దె
లియుదు. దాహపీడితులమై యెండమావుల వెంబ
డించి, నీరులభింపక పలవించుచున్నాము. శాశ్వతా
నందమునుగోరి, క్షణికమగు ప్రాపంచికభోగసాగర
మునఁబడి యీఁదులాడి, ఱెక్కలుముక్కలై, నెత్తి
నోరును బాదుకొనుచున్నాము. మనము కోరుపర
మావధి వేఱు; దానినిఁ జేరుటకై మనము పట్టు
మార్గము తప్పుమార్గము. చేయవలసినది చేయక,
ఆనందము లభించినది కాదని పరితపించుచున్నారము.

## ఉన్న విషమపరిస్థితి.

తత్త్వజ్ఞకవీశ్వరుఁడగుభర్తృహరిమహాశయుఁడు
మనపరిస్థితి సద్భుతముగా వర్ణించియున్నాఁడు;

శ్లో. వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ,
రోగాశ్చ శాత్రవఇవ ప్రహరంతి దేహమ్,

ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభో,
లోక_స్త దప్యహిత మాచరతీతి చిత్రమ్.

"ముసలితనము పెద్దపులివలె మీఁదనుముక భయపెట్టుచున్నది. రోగములు శత్రువులవలె దేహము తినివేయుచున్నవి. ఆయువు చిల్లికుండలోని నీటివలెఁ గారిపోవుచున్నది. పరిస్థితి యిట్లున్నను, లోకులు అహితమే చేయుచున్నారు. ఇదియేచిత్రము!" పుట్టిన ప్రతిప్రాణికి రోగము, దుఃఖము, చావు నివితప్పవు. ప్రతిజీవియు నెప్పుడో యొకప్పుడు రోగదుఃఖజరామృత్యువుల నిష్టమున్న లేకున్న ననుభవించితీరవలెను. ప్రతిఱెప్పపాటుతో మనము శ్మశానమునకు జరుగుచున్నారము. మనమందఱము కాశీగయాప్రయాగాది క్షేత్రములకుఁ బోవు యాత్రికులము కాము. శ్మశానక్షేత్రమునకే మనము నిరంతరము, సూటిగా యాత్రచేయుచుఁ బోవుచు

న్నారము. మనకీసంగతి తెలియునుగాని తెలియనట్లు ప్రవర్తించుచున్నాము. ఇదేలసంభవించుచున్నదను ప్రశ్నయే మనకనులలో ధూళిఁగొట్టి అంధత్వమును గలుగఁ జేయుచున్నది.

సంసారమును వర్ణించుచు మహాభారతమీసందర్భమునే ఒక చమత్కారగాథలోఁ జెప్పియున్నది. ఒకబ్రాహ్మణుఁడరణ్యమునఁ బ్రయాణము చేయుచున్నాఁడు. చాలకాలము వెనుకనే స్వగ్రామము విడిచియుండుటచే భార్యాపుత్రులఁ జూచుదీర్ఘకుతూహలముతో, నెత్తినిండ బరువుపెట్టికొని, తొందరగాఁబోవుచున్నాఁడు. ఇట్టిస్థితిలో నొకపెద్దపులి బ్రాహ్మణునివెంటాడినది. భయకంపితుఁడై బ్రాహ్మణుఁడు ఆత్మరక్షణార్థమై, పరుగిడనారంభించినాఁడు. ఇంతలోఁబెద్దపులిఘూంకరించుచు, సమీపించి మీఁదనుఱుక సిద్ధముగానుండఁగా, మరణభీతితోఁ బరిత

పించుచు, ముందొక పాడునూతిని గాంచి, తటా
లున అందుఱికినాఁడు. కాని యాతఁడు నీటిలోఁ బడ
లేదు. నూతియొడ్డుననున్న ఒకచెట్టువేరు, గోడను
చీల్చుకొనివచ్చి నూతిలో వ్రేలాడుచుండఁగా బ్ర
హ్మణుఁడది పట్టుకొని నిలఁబడెను. ఆవేరు, క్రిందనీ
టికిఁ బైవంచకు సమానదూరములో నున్నది. ఒక
లవిషసర్పము నోరు తెఱచి, నీటిపైఁ దేలియాడ
విషానలజ్వాలలను గ్రక్కుచున్నది. నూయిపై
గమున వ్యాఘ్రము గర్జించుచు నిలఁబడియున్నది
హ్మణుఁడు క్రిందనీటిలోఁ బడుటకుఁగాని, పైకె
టకుఁ గాని వీలులేదు. ఉన్నస్థితిలో నుండుట
ఏ వీలులేదు. ఏలనఁ, బగలు, రాత్రియను రెండె
కలు, పైభాగమునుండి బ్రాహ్మణుఁడు జీవాధా
ముగాఁ బట్టుకొని వ్రేలాడుచున్న వేరును నిద్రా
గములు మాని కొఱికివేయుచున్నవి. ఇఁకఁ గొ
ది నిముసములలో వేరు తెగిపోవకతప్పదు.

ఇప్పుడు నూతిలోని ప్రాణికి మూఁడేమార్గములు న్నవి. నీటఁబడవలెను; లేదా పైకిరావలెను; లేదా, వేరుపట్టుకొని, ఉన్నపద్ధతిలోనే వ్రేలాడవలెను. పైకివచ్చినచో వ్యాఘ్రమొక గుటకలో నాతని మ్రింగివైచును. క్రిందకు దుమికినచో నాతఁడు కాలసర్పగళములోఁ బడవలెను. వేరుపట్టుకొనియు నుండఁజాలఁడు. ఒకక్షణములో వేరు తెగిపోయి తీరును. నాలుగవపద్ధతి మఱొకటిలేదు. మిగిలిన మూఁడుపద్ధతులలో నేపద్ధతి ననుసరించినను చావు తప్పదు. ఊహించుటకుఁ గాలము లేదు. ఒకక్షణము లోనే మృత్యువు. ఊరకొన్న మృత్యువే. ఏమిచేసి ననుచావే ! ఏమిచేయుట ? మనమందఱమును బ్రాహ్మణుఁడున్న విషమపరిస్థితిలోనే యున్నారము. తరణోపాయము కన్పట్టుటలేదు. మరణశాసన మన ల్లంఘనీయము. బ్రతికియున్న మూఁడుదినములు రో

ముతో, ముసలితనముతో, వచింపనవసరము లేని కోటిదాృష్ట్యములతో మనము పోరాడవలసియున్నది. ఈతుదిలేని దుఃఖసమస్య ప్రతిప్రాణి నెదుర్కొని, పరిష్కారము చేయుమని సవాలు చేయుచున్నది. మనకు శాంతిసుఖములు వలయుచో నొకటేమార్గము న్నది. ఈకఠినసమస్యను పరిష్కరించుటే ఆమార్గము.

ఈసందర్భమునే వేఱొక ఉదాహరణముతోఁ జెప్ప వచ్చును. మనమొక గృహములో నున్నాము. ఇల్లు అన్నివైపుల మండుచున్నది. మనము బయటికిఁబో యినచో అగ్నిజ్వాలగుండ బోవలెను. అట్లుపోవుచో మనశరీరము మూఁడునిముసములలో భస్మమగును. ఉన్నచోటనే యున్నచో, నొకక్షణములో నగ్ని జ్వాల చుట్టుముట్టి కాల్చివైచును. మనముకదలుటకు వీలులేదు. నిలఁబడుటకును వీలులేదు. రక్షణోపా యమేది ?

భారతీ బ్రహ్మర్షి వాణి.

ఇదియే సమస్త సమస్యలకు మూలసమస్య. ఈ జీవిరహస్యార్థసమస్య ప్రాణికోటికంతకు నొకటే. ఇందు జాతిభేదములు, దేశభేదములు, వర్ణభేదములు, మతభేదములు లేవు. ఇది ప్రతిప్రాణి, ఏదేశమున, ఏజాతిలో, ఏకులములో, నేరాజ్యములో నున్నను పరిష్కరించుకొని తీరవలసిన సమస్య. ఇట్టి కిష్ట సమస్యాచక్రముసంధునఁబడి నలిగిపోవుచు మనము సుఖాసీనులమైయున్నట్లు తలఁచుచున్నాము. సమస్త మతతత్వశాస్త్రములు, మానవకోటి కీపరిస్థితి నెదుటఁబెట్టి, పరిష్కారము చేసికొమ్మని యాహ్వానించుటే ప్రధానకర్తవ్యము. ఈకర్తవ్యమునే భారతీ బ్రహ్మర్షి అఖండమహోత్సాహసాహసములతో నెఱవేర్చినాఁడు ;

"ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత,
క్షురస్యధారా నిశితా దురత్యయాదుర్గంపథ
స్తత్కవయోవదంతి॥

"లెమ్ము! మేల్కొనుము. బ్రహ్మజ్ఞానులను జేరి జ్ఞానముపొందుము. బ్రహ్మజ్ఞానమార్గము, వాడియైన కత్తికొనపై నడచుటవంటిదే. ఆమార్గము నడచుటకు శక్యముకానిదని, అట్లు నడచినజ్ఞానులు చెప్పుచున్నారు." ఉపనిషన్మహర్షి, మానవకోటికిఁగల, ప్రధానసమస్యను అతిసూక్ష్మముగాఁ బరికించి, అజ్ఞానపంకిలమునఁబడి పలవించుచున్న ప్రాణికోటి యం దనంతదయాంతఃకరణముతో నీవిధముగావిశ్వ ందేశమును ప్రయోగించినాఁడు. మనమజ్ఞానగాఢాంధ రమున నిద్రాముద్రితులమై పడియున్నారము. చి, మేల్కొని, మన యథార్థపరిస్థితిని గమనింపు ని ఉపనిషత్తు బోధించుచున్నది. సత్యమార్గమున

నడచుట సులభము కాదు. అది వాడియైన కత్తికొన పైఁ గాలిడుటే. అందుచే ఆత్మజ్ఞాన మెఱుఁగుటకు సంసిద్ధులగువారు, పరిపూర్ణత్యాగము చేయుటకు సంసిద్ధులుకావలెను. ఇదివఱకే మనకాలము, మన శక్తులు వ్యర్థములైనవి. ఇఁక నొకక్షణమైనను వ్యర్థముచేయరాదు. ఈవిషమపరిస్థితినుండి తప్పించుకొనుటకు మనముచేయవలయు కర్తవ్యమును తెలిసికొని, వెంటనే ఆచరించుట కారంభింపవలెను.

నచికేతుని విశ్వాసంజేశము.

సత్యము నెఱిఁగితీరవలెనను కాల్చివేయుతృష్ణ, సృష్టిరహస్యార్థమును జూచితీరవలెనను అనివార్యమగువాంఛ, ఇవియే మానవుని ఆధ్యాత్మిక జన్మమునకు సూచనలు. సామాన్యలోకవిజ్ఞాన మీమాంసతిని స్పష్టముగాఁ జెప్పుచున్నది; దుర్గాహ్యమగు తత్త్వశాస్త్రముల సారమిదియే ప్రకటించుచున్నది

ఊహాగల ప్రతివ్యక్తియు నీసంగతిని సహజముగాఁ దెలిసికొనవలసిన ధర్మము. లోకవిషయములఁగూర్చి మనము తీవ్రముగా నాలోచించినపుడు, తుదిలేని అసంతృప్తి మనల నావరించును. మనము ప్రియతమములని పట్టుకొని ప్రాకులాడు వస్తువులు మనల నాకర్షించి, చేయిచాచినంతలో నదృశ్యములగుచున్నవి. మనరక్తములో రక్తమని ప్రేమించి, పెంచు బంధువులు, మనకనులయెదుటనే, ధూళిలోఁగలసి మనవిశ్వాసమును మూలముట్టుగఁ బీకివైచుచున్నారు. ఏల యిట్టిసందర్భము తటస్థించుచున్నదో, ఊహించినకొలఁది, చిత్తశాంతిచెడి, అసంతుష్టియే మిగులుచున్నది. అసంతృప్తితీవ్రజ్వరముచే శరీరమానసములు తప్తమై, తాపమనుభవించువారు నిజముగా ధన్యులు. ఇదియే సత్యాన్వేషణానుతాపము. దీనినే హిందువులు బ్రహ్మవిచారమందురు. సత్యము

నకై పరితపించు హృదయమునందే, సకలమతములు తత్త్వశాస్త్రములు నుద్భవించినవి. అచేతనములగు మతగ్రంథములలోని సత్యాంశములకు, చైతన్యమొసంగి, సజీవమొనర్చున దీసత్యాన్వేషణానుతాపమే. ఈఅనుతాపమే ధర్మము, మతము, కర్మ, జ్ఞానము, భక్తి, సర్వమునిదియే.

కఠోపనిషత్తునందలి నచికేతుఁడిట్టి దివ్యానుతాపధాజ్యాధిపతియై, మానవకోటి ఆర్జింపవలసిన పరమావధిని నిర్ణయించి యున్నాఁడు. నచికేతునకు యముఁడు మూఁడువరములొసంగినాఁడు. తనమూఁడవ వరమునుగూర్చి నచికేతుఁ డీవిధముగాఁ గోరినాఁడు:

యేయం ప్రేతేవిచికిత్సామనుష్యేఽస్తీత్యేకే, నాయమస్తీతిచైకే। ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం వరాణామేషవరస్తృతీయః ॥

(కఠ-ఉ. 1-1-20)

" ఈశరీరము మరణించిన వెనుక, ఇంకను జీవి ఉన్నదని కొందఱు, లేదని కొందఱు చెప్పుచున్నారు. ఈవిషయమైనజ్ఞానమును నీవలనఁ దెలిసికొనవలెనని కోరుచున్నాను. వరములలోనిదియే నామూఁడవవరము." సృజింపఁబడిన ప్రతిప్రాణియు నెప్పుడో యొకప్పు డడిగి తీరవలసినప్రశ్న నచికేతుఁ డడిగినాఁడు. నచికేతుని హృదయము నిజముగా సత్యమునకై పరితపించుచున్నదో లేదో తెలిసికొనవలెనని యముఁడు పరీక్ష చేయఁదలఁచినాఁడు. అపూర్వములగు భోగభాగ్యముల మోహమను నుచ్చొకటి నచికేతునిపై నాతఁడు విసరినాఁడు;

"యేయేకామాదుర్లభామర్త్యలోకే సర్వాన్ కామాగ్ శ్ఛందతః ప్రార్థయస్వ। ఇమారామాః సరథాస్సతూర్యానహీదృశాలంభనీయామనుష్యైః। ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణంమానుప్రాక్షీః॥ (కఠ. ఉ. 1-1-25

"ప్రేయోకోరికలు మనుష్యలోకములో దుర్లభము లౌ అట్టినియిచ్చవచ్చిన సమస్తమైనకోరికలను అడుగుము. రథములతోఁ దూర్యములతోనున్న ఈదేవకన్యకలు మనుష్యమాత్రులకు లభించువారుకారు. వీనిని నాచేఁ బొంది నీవు పరిచర్య చేయించుకొనుము. నచికేతా! మరణమునుగూర్చిన ప్రశ్న విడిచిపెట్టుము." యముఁడు పడవైచిన యీమోహమనువలను నచికేతుఁడు పుటుక్కునఁ ద్రెంపివైచినాఁడు. ప్రస్తుత ప్రపంచమున, వివిధజాతులను నడపించునాయకులు, భోగమోహము లను నుచ్చులను తీవ్రముగాఁ గంఠమునకు బిగించుకొని, కోడిపుంజులవలెఁ బరస్పరము ఢీకొనుచున్నారు. ప్రపంచశాంతివలయుచో, సామ్రాజ్యకాంక్ష, యుద్ధకాంక్ష, ఆక్రమణకాంక్ష, నశింపవలెను. యమునిపరీక్షకుఁ జెప్పినజవాబులో నచికేతుఁడెట్టి శాశ్వతసందేశమును ప్రయోగించినాఁడో తిలకింపుఁడు;

" స్వోభావా మర్త్యస్యయదంతకైతత్సర్వేంద్రియాణాం జరయంతి తేజః । అపిసర్వంజీవితమల్పమేవ, తవైవవాహా స్తవనృత్యగీతే."

"నవిత్తేన తర్పణీయోమనుష్యోలప్స్యామహేవిత్త మద్రాక్ష్మచేత్త్వం । జీవిష్యామోయావదీశిష్యసిత్వం వరస్తుమేవరణీయస్సఏవ॥ (కఠ. ఉ. 1-1-26, 27)

"ఇవి క్షణికములు. మనుష్యుని యింద్రియముల తేజమును ఈభోగములు నశింపఁజేయును. ఎంతదీర్ఘ జీవితమైనను క్షణికమే. కావున వాహనములు, నృత్య గీతములు, నీవేయుంచుకొనుము. విత్తముచే మనుష్యుఁడు తృప్తిపొందఁజాలఁడు. నీదర్శనముచే విత్తముకావలసిన లభింపఁగలదు. నీవుతలచినంతకాలము మేము జీవింపఁగలము. కాని నాకునావరమే అనుగ్రహింపుము."

లెక్క తెలియని వేలకొలఁది సంవత్సరముల వెనుక, క్రైస్తవమతముకాని, మహమ్మదీయమతముకాని,

బౌద్ధమతముకాని, మఱేయితరమతముకాని లేనికాల మునఁ, బశ్చిమజాతులు మానవత్వ మెఱుంగక, మృగములవలె ఆకులలములు తిని, బట్టకట్టుకొను టెఱుం గనిమహాఘోరకూపమునఁ బడియున్నపుడు, ఈపవిత్రభా రతవర్షమున జన్మించి, నచికేతుఁడు ప్రాణికోటిపొంది తీరవలయు పరమార్థసందేశమును, సంశయమావంత యులేని అనల్పధీరగంభీరకంఠము నెత్తి, విశ్వమునకు గానమొనర్చినాఁడు. నచికేతుఁడు పల్కినవాక్యము, భారతజాతిగుండెలోని రక్తస్పందనశబ్దమే. సత్యాను భూతిలేని, ఆత్మానందము నెఱుఁగని, శాశ్వతశాంతి లభింపని, రాజ్యసంపాదనార్భాటములు, ఆర్థికనిర్మా ణప్రయత్నములు, సమత్వసిద్ధాంతములు పసిబిడ్డ పిచ్చియాటలని నచికేతుఁడు ఘోషించినాఁడు. సందేశమే భారతజాతిరక్తము, ప్రాణము, సర్వము దీనినుద్ధరించి, లోకమునకు బోధించుటకే, భా

భూమినేటికినినిలచియున్నది. ప్రతిప్రాణియు నెప్పుడో యొకప్పుడు, తెలిసి, సత్యము ననుభవములోనికిం దెచ్చుకొని తీరవలెననెడి యీధర్మమే ప్రపంచమునకు భారతవర్ష మీయవలసినసందేశములోఁ ప్రథమ భాగము.



# హిందూమతము

## ద్వితీయ సందేశము.



### ఆధ్యాత్మికవ్యక్తిస్వాతంత్ర్యము.

స్వాతంత్ర్యశబ్ద మనేకార్థములతో వాడఁ బడుచున్నది. శారీరికస్వాతంత్ర్యము, మానసికస్వాతంత్ర్యము, ఆత్మస్వాతంత్ర్యము. బంధములు లేకుండుటే స్వాతంత్ర్యము. అనఁగా స్వేచ్ఛగాదు. నియమములు లేనిది స్వేచ్ఛ. స్వాతంత్ర్యమునకు నియమములకు విరోధము లేదు. కేవల భౌతికరంగములోని స్వాతంత్ర్యము పునాదిలేనిగోడ. కేవల మానసికస్వాతంత్ర్యము చుక్కానిలేని పడవ. పరిపూర్ణ స్వాతంత్ర్యము, ఆత్మిక, మానసిక, భౌతికరంగములలో ఈశ్వరధర్మము నాచరించుటలోఁ గల

స్వేచ్ఛయే. ఈభావముననుసరించి ఈశ్వరుఁడొక్కఁ డే పరిపూర్ణస్వతంత్రుఁడు. హిందూమతము ప్రకారము, సంపూర్ణస్వాతంత్ర్యశక్తిని ప్రతిప్రాణియు గర్భమునందిడుకొనియున్నది. మనమందఱము ఆనంద స్వరూపులమని శ్రుతిచెప్పుచున్నది. కాని కారణాంతరములచే మన మపరిపూర్ణులమని, అల్పులమని, పాపులమని నమ్మి వ్యవహరించుచున్నారము. మన మస్వతంత్రులమనుకొను నీనీచజ్ఞానమును నిర్మూలించుటకు హిందూమతము పెక్కుమార్గములను చూపుచున్నది.

## సత్యము సర్వేంద్రియాతీతము.

సర్వమతగ్రంథములు, అందు ముఖ్యముగా మనశ్రుతులు, సత్యము ఇంద్రియములకు, మనస్సునకు, బుద్ధికి అతీతమని స్పష్టముగాఁ జెప్పుచున్నవి. మనకన్ను విశ్వములోని అతిస్వల్పభాగము నేచూడఁ

గలదు. మనముక్కు కొలఁదిదూరములో వాస
ననేచూడఁగలదు. అట్లే మనమనస్సును బుద్ధియు
మిక్కిలి పరిమితశక్తిగలవి. స్థలము, కాలము, నిమి
త్తము నీమూఁడును బుద్ధియొక్క సమస్తవ్యాపార
ములను బంధించును. ఒకవస్తువునుగూర్చి మనమూ
హించుట కారంభించినంతనే, దేశకాలనిమిత్తములు
మూఁడును వచ్చితీరును. ఈమూఁడును ఊహకుఁ బరి
మితిగల్పించి, వ్యాకీర్ణమునచ్చును. సత్యమునకు మి
తి లేదు; బంధములు లేవు. (Truth is above the
limitations of space, time and causa-
tion) పరిమితి బంధములుగల బుద్ధి, ఏపరిమితి లేని
సర్వబంధాతీతమైన సత్యమును గ్రహించుట అసం
భవము. మనమెంతకాలము అపరిపూర్ణులమై యుం
దుమో అంతవఱకుఁ బరిపూర్ణమగు సత్యమున
గూర్చి తెలిసికొనఁజాలము. అట్లుకాక, మనమున

పరిపూర్ణులమే అయినచో, నప్పుడు తెలిసికొనవలసిన దేదియు లేదు. మనము సర్వజ్ఞులమైనచో సర్వజ్ఞుడగు నీశ్వరస్వరూపులమే అగుదుము.

ప్రకృతిలో విస్పష్టముగా గోచరించు విషయములను లేవనినఁ బ్రయోజనము లేదు. ఉన్న పరిస్థితులలో మనము అల్పజ్ఞులమై, అతిస్వల్పశక్తులనే కలిగి యున్నారము. ఈస్వల్పబుద్ధి శక్తియైనను ఏకాగ్రత లేక, అనేక విషయములపైఁ జెదరి విచ్ఛిన్నమై యున్నది. అందుచే మనము సత్యమును ప్రత్యక్షముగా నిపుడు దర్శించుస్థితిలో లేము. సత్యజ్ఞానానంతస్వరూపమగు బ్రహ్మపదార్థమునుగూర్చి మనము ప్రత్యక్షజ్ఞానమును పొందుటకు సాధ్యముకానంతవఱకు, మనజ్ఞానమున కొకటే మార్గమున్నది. మనము పరిమితిగల మనమనోబుద్ధులమీఁద నే ఆధారపడకతప్పదు. మనమనస్సులు, మనబుద్ధులు, దేశ

మునుబట్టి, జాతినిబట్టి, కులసాంప్రదాయముల నను సరించి, ఇంకను ఎన్నియో ఉపాధులనుబట్టి, భేద ములు గలిగియుండును.

## ఉపాధిభేదములు.

జిహ్వకొకరుచి, మనిషికొకమతము. ఈసామె తలో సమస్త తత్వశాస్త్రార్థము నిమిడియున్నది. ఎచటికో పోవనక్కరలేదు. ఒక కుటుంబములోని వ్యక్తులరుచులలో, ఊహలలో నెంతభిన్నత్వమున్నదో చూచిన, విశ్వకుటుంబమునుగూర్చివిశేషము చర్చింప నవసరములేదు. నలుగురు సోదరులున్నచో నందొ కఁడు గాయకుఁడు, ఒకఁడు తత్వజ్ఞానాభిలాషి, మ ఱొకఁడు కేవలలౌకికుఁడు, నాల్గవవాఁడు పట్టినరక్ష రకుక్షియుఁ గానచ్చును. ఒక యింటనే వంకాయ పచ్చడి చేసిన, ఒకరు చప్పిడిపచ్చడి, ఇంకొకరు పు లుసుపచ్చడి, మఱొకరు బెల్లముపచ్చడి, కోరుదురు.

ఇంకొకరి కసలుపచ్చడియే రుచించదు. ఒకసోదరుఁడు శివనామ స్మరణము చేయుచు కాశీయాత్ర కేగిన, నతని తమ్ముఁడూరనున్న రామాలయములోని వాసము లూడఁబెరికి వంటకుపయోగించును. ఒక గ్రంథాలయమునొద్దకు వచ్చుసోదరుల ప్రవర్తనలో భిన్నరుచులన్నియు వెల్లడియగును. ఒకఁడుపద్యకావ్య ముతప్ప మఱేదియు ముట్టఁడు. మఱొకనికి నవలలే నిత్యాహారము. వేఱొకఁడు వేదాంతగ్రంథము లే దకుచుండును. ఇంకొకఁడు శిలాశాసనములోని దీలకై చెమటలు గ్రక్కుచుండును. వేఱొకఁడు లియర్డుబల్ల విడువఁడు. మఱొకపుణ్యాత్ముఁడు, పహోత్సుఁడువచ్చి, జాతులలో నూతనశకములను ల్పించు మహోపన్యాసము లొసగుచున్నను, క్యా స్పబల్లమీద వ్రేలు బ్రద్దలగునట్లు కొట్టుచునే డును. ఈ ఉపన్యాసమును వినుటకే మఱొక

బుద్ధిమంతుఁడు 500 మైళ్ల దూరమునుండి నడచి
మైన వచ్చి తదేకదృష్టితో వినుచుండును. ఇంకొ
కఁడీమహాప్రవర్తకుని నల్లజెండాలతో దర్శనమిచ్చును.
వేఱొకఁడువచ్చి యిరువురను చెఱసాలకుఁ బంపును.
ఇవన్నియు జాతికులమతదేశ రాజకీయ సాంఘికాది
గణనాతీత సందర్భములను, సంస్కారములనుబట్టి,
అతివిచిత్ర భిన్నత్వముతో నడచుచుండును. కాని
ఎవరేమిచేయుచున్నను, ప్రతిజీవి గుండెపైఁ జేయి
పెట్టి, శాంతచిత్తముతో విన్నచో "ఆనందమే
కావలెను. శాంతియేకావలె" ననుచు నిరంతరము
కొట్టుకొనుగుండెతటతట విస్పష్టముగా వినఁబడును
ఈగుండెదెబ్బలో భిన్నత్వము లేదు. నిత్యానందవాంఛ
మానవకోటినంతను, ప్రాణిప్రపంచమునంతను ఒకే
సూత్రమునకు బంధించి నిలుపుచున్నది. ప్రాణి
కోటికి వలయునదొక్కటే; దానిని పొందు పద్ధతిలో

భిన్నత్వము మాత్రము తప్పదు. దేవునిఁ గూర్చి మనకు భిన్నాభిప్రాయము లుండక తప్పదుగాని, మనకు భిన్నాభిప్రాయము లన్నియు నొకేదేవునిఁ గూర్చి యను సంగతి ముఖ్యముగా మఱచు చుందుము. కాశీపోవుట కనేకమార్గము లున్నవి కాని, అన్నిబాటలును కాశీతోడ్కొని పోవును. ఎన్నియో మతములు, మతశాఖలు నున్నవికాని, అన్నియు నొకేపరమేశ్వరుని సూచించును. తత్త్వ శాస్త్రము లనేకములున్నవి కాని, అన్నియు నొకే సత్యమును గూర్చి పలుకును.

భిన్నత్వమేలయున్నది ?

లోకములో భిన్నాభిప్రాయములు, భిన్నమత ములు, భిన్నరుచులు ఏలయున్నవను ప్రశ్నకు, మన బుద్ధి జవాబుచెప్పఁజాలదు. ఏలన, మనబుద్ధియు భిన్నత్వములోఁబుట్టి, అందే పెరిగినది. ఒకవిధముగ

భిన్నత్వము పేరే బుద్ధి. ప్రకృతిలో, మానవప్రకృతిలో భేదము లేలయున్నవని యడుగుట, ఆకసమునఁ గణనాతీతనక్షత్రము లేలయున్నవని ప్రశ్నించుటే. ఈభేదములను సృజింపుమని మనమెవ్వరినిఁ గోరలేదు. కాని అవిమనయెదుటనున్నవి. భిన్నాభిప్రాయములను తుడిచి ఒకే అభిప్రాయమును, మతమును, లోకములో నిలుపవలెననుట, నక్షత్రకోట్లనన్నిటినిఁ దుడిచివైచి, ఒక పెద్దనక్షత్రమును చేయవలెననుటే. మనము పరిమితబుద్ధితో, ప్రకృతిభిన్నత్వమును గూర్చిన అనంతసమస్యను పరిష్కరింపఁజాలము.

ప్రకృతిలోని భేదము సామాన్యమైనది కాదు. ప్రకృతిలో నేరెండువస్తువులును సమానములుగావు. ప్రతివస్తువును, తదితరవస్తువునుండి వేరుచేయు నొక ప్రత్యేకత్వమును గలిగియున్నదని ప్రకృతిశాస్త్రజ్ఞ

లు నిరూపించియున్నారు. అదేవిధముగాఁ బ్రతిప్రా
ణియుఁ దదితర ప్రాణులనుండి, ఏదో ఒక ప్రత్యేక
గుణమందు భేదమును చూపితీరును. విశ్వసృష్టికి,
సృష్టిలోని భిన్నపదార్థములకు, ప్రాణులకు మూలా
ధారమైయున్న పరమాత్మశక్తిలో నీభేదములు లేవ
నియు, నీభిన్నత్వము ప్రదర్శనములోనే యున్నదని
యుఁ, గర్మసిద్ధాంతము ననుసరించి, హిందూమతము
ఋజువుచేయుచున్నది.

ఈ భిన్నత్వమునకు, ఈ నానాత్వమునకు సరి
పగు స్థానముఁజూపి, సమన్వయింపని తత్త్వశా
స్త్రము నిరర్థకము. ఈ మానవప్రకృతిలోని అనేక
త్వమునుండి, ఒకేగుణమును గ్రహించి, యిదియే
సర్వమునని, తదితరమును విడిచిపెట్టుమతము, నీర
సించిన మానసముయొక్క పక్షపాతమతము. ఈ
నానాత్వమును సవరించి, సమన్వయించి, అర్థము

తెల్పునదే మతము, తత్త్వశాస్త్రమును. తదితరము లన్నియుఁ గేవలవాగాడంబరములే.

## నానామతములు.

పరమాత్మస్వరూపమగు సత్యము మనోబుద్ధీంద్రియముల కందరానిదగుటచేతను, కొలఁదిమంది సత్యద్రష్టలు తప్ప, మనమందరమును అనంతమగు సత్యమును, గ్రహించుటకు శక్యముకాని పరిమితములగు బుద్ధులచేఁ గొలతవేయవలసి యుండుటచేతను, మనబుద్ధులలో భిన్నసాంప్రదాయములచే భేదములుండక తప్పనిసరియగుటచేతను, మనమందరము, ఒకేసత్యమునుగూర్చి, భిన్నాభిప్రాయములే కాక, పరస్పర విరుద్ధాభిప్రాయములను గలి యుండుటకూడ సహజమేకాక, తప్పని సరికూడనై యున్నది. ఇట్టి అమోఘమగు కారణములచే, నానామతములు బయలుదేరుటలో నాశ్చర్యమేమియులే

దు. ఇంతేకాదు. ఒకేమతములో ననేకశాఖలు శాఖ లకు శాఖాంతరములు విశేషముగాఁ దలలెత్తినవి. ఇంకను దూరముగా నాలోచించినచో; 'మనిషికొక మతము'ను సామెతననుసరించి, వ్యక్తికొకమతము న్నట్లు సులభముగా గ్రహింపవచ్చును.

నేఁడు ఐదారుమతములే ముఖ్యముగా జాతులచే గుర్తింపఁబడియున్నవి. ఇది సత్యముమాత్రముకాదు. తలకొకమతమున్నదని మనమిదివఱకే చెప్పియున్నా ము. ఇందసహజమేమియు లేదు. మానవకోటిలోఁ బ్రతివ్యక్తియొక్క మానసము, క్రమక్రమోన్నతాభి వృద్ధిదశలో, ననేకాంతరువులలోనున్నపుడు, ఒకే సత్యమునుగూర్చి, వ్యక్తికొకప్రత్యేకాభిప్రాయముం డుట, ఒకవ్యక్తికే క్రమక్రమముగా జ్ఞానమభివృద్ధి గాంచకొలది, అభిప్రాయములు మారుచుండుట నిం తమాత్రమైనను వైచిత్ర్యమేమియును లేదు. ఒకఁడీశ్వరుని

జగన్మాతగాను, మఱియొకఁడు తండ్రిగాను, ఇంకొకఁడు విశ్వయజమానిగాను, ఊహించినచో నందు ప్రమాదమేమున్నది ? నిర్గుణనిరాకారుఁడు, సగుణ సాకారుఁడు రెండును దానేయైన పరమేశ్వరుని నిర్గుణవ్యక్తిస్వరూప మూహింపయత్నములో, గొందఱు ఆకారములను, విగ్రహములను, ప్రతిమలను సహాయకారులుగా గ్రహించుటలో నేమి ఘోరదోషమున్నది ? లోకమున నీశ్వరధర్మవ్యాప్తికై పుట్టి, జాతులలో నూతనచైతన్య ముద్భవింపఁజేసి, మహామతములను స్థాపించి, విశ్వమార్గదర్శకులై వెడలిన రాముఁడు, కృష్ణుఁడు బుద్ధుఁడు, క్రీస్తుమున్నగువారలను ఈశ్వరావతారములనుగాఁ గొందఱర్చించుటలో మహాపరాధ మేమి చటనున్నది? ప్రకృతిసౌందర్యమును జూచి, అంతఃకరణ ముప్పొంగువాఁడు పరమేశ్వరుని అనంతసౌందర్యనిధిగాఁ బ్రేమించి యారా

ధించును. దుఃఖార్తుఁడగువాఁడు ఈశ్వరుఁ నంత దయాసాగరునిగా నర్చించును. సునిశితబుద్ధిగలిగి, తీవ్రతర్కాభ్యాసమును పొందించుకొను మేధావి ఆపరమేశ్వరునే, అప్రమేయప్రజ్ఞానిధిగా నూహించును. ఇందులో మానవప్రకృతి కసహజమగు సందర్భమేమున్నది ?

శాఖాదురభిమానము.

ఒకే పరమేశ్వరునిఁ గూర్చి వ్యక్తులూహించు భిన్నాభిప్రాయములకుఁ దావొసఁగనిమతము చిర వ్యాప్తి నందఁజాలదు. కోట్లకొలఁది ప్రజలుండఁగా, అనంతకోటి భిన్నాభిప్రాయముల కవకాశముండఁగా, నొకేఅభిప్రాయమునుగ్రహించి, ఇదియేసిద్ధాంతము, తదితరములన్నియు నిరర్థకములని వచించు తత్వ శాస్త్రము కేవలసంకుచితదృష్టిలో బయలుదేరినదే. విశ్వపరమావధియగు, శాశ్వతమోక్షము పొందుట్కు

కు, అనేకమార్గములుండఁగా, నొకేదారి చూపుటయే కాక, తక్కినబాటలన్నియుఁ దప్పని వాదించుమతము గర్హింపఁదగినదుర్మతమే. ఒక శాఖకుఁగాని, ఒక ప్రత్యేకమతసాంప్రదాయమునకుఁగాని, ఒక ప్రత్యేకమతసంఘమునకుఁగాని చెందినవ్యక్తి, తనపుత్త్రలో దేవునిఁగూర్చి, విశ్వమునుగూర్చిపుట్టినఅల్పాభిప్రాయ మొకటే సత్యము, తదితరాభిప్రాయములకుఁ దావు లేదని చెప్పినచో నట్టివ్యక్తి నివెంటనే శృంఖలాబద్ధునిఁజేసి ఉన్మాదశరణాలయమునకంపవచ్చును. లోకాతీతులగు సత్యదర్శకులకుమాత్రమే తెలియు పరమార్థమును గూర్చి, మనకందఱకు, లోపబుద్ధులచేఁదెలియు పరిమితాభిప్రాయములనుపట్టుకొని, ఇందొకరు తెల్పినది సత్యము, మఱొకరుతలచునది మిథ్యయని, పెనగులాడుపద్ధతి కేవలమూర్ఖపద్ధతియేకాక, తీవ్రనిందార్హమన్నను తప్పులేదు.

## అన్యమతములు.

ఒక్క హిందూమతముతప్ప, తక్కిన మతము లన్నియు, అనేకమార్గములలోనే యొక్క మార్గమునో బోధించుమతము లే. ముక్తిసాధనమునకు, యాత్రిక సహస్రములకు, ఇదివఱకే నిర్మించినవి, ఇంకనునిర్మింపం బోవునవి లక్షలకొలది దారులుకలిగియుండఁగా నీసత్యమును గుర్తింపకపోవుట, ఒకవేళ అల్పముగా గుర్తించినను, ఒకేదారిమీదనే "వెళ్ళవచ్చు" నన్నియు, తక్కినదారులమొగలో "కంటకారణ్యా" మని యువ్రాసి, హిందూమతేతరములన్నియు, నిదియే విశ్వమతమనియు, పరమసత్యమనియు ఘోషించుచున్నవి. ఈఘోష పరమపవిత్రమగు వ్యక్తిస్వాతంత్ర్యమును కూకటివేళ్ళతోఁ బెల్లగించివైచు టే. సృష్టిసత్యార్థమునుగూర్చి,ఒకజీవి తనఊహాశక్తిననుసరించి, సాంప్రదాయముల ననుసరించి, మఱెన్నిసందర్భ

సత్యాన్వేషకుని మానసమొక చిన్ని మొక్క-వంటిది. ఆ మొక్క పెరుగుటకు వలయు ఎఱువు, నీరు, రక్షణము గంచె, మనము నిర్మింపఁగలము. కాని, మొక్కను "నీవు ఇట్లు పెరుగు"మని శాసించుశక్తి మానవకోటికి లేదు. పెరుగుట, వృద్ధిపొందుట యనునది కేవలము, వ్యక్తిపరము, ఆత్మికము, ఆంతరంగికము. బాహ్యసందర్భములెన్నికలసినను, మొక్కను పెరుగునట్లుచేయఁజాలవు. బాహ్యమునలభించిన పదార్థజాలమునుండి, మొక్కలోని ప్రాణి, తన అభివృద్ధికివలయుభాగములను తనవ్యక్తిధర్మము ననుసరించి, గ్రహించి, పరిపూర్ణ స్వాతంత్ర్యశంఖారవము నూదుచుఁ దన యిచ్ఛవచ్చినరీతినే పెరుగును. సత్యాన్వేషకుని మానసాంకురమునట్టే. బాహ్యపరిస్థితులు, జీవియాత్రలో నిమిత్తమాత్రములే కాని, బాధించుశక్తికలవికావు. సృష్టిలోని పదార్థరాశినిఁ

ము తగవులాడదు. ఈశ్వరారాధనవిషయములో సమగ్రముగువ్యక్తిస్వాతంత్ర్యము నంగీకరించుటయే కాక, సమకూర్చుటయే, వేదవేదాంతములయొక్క ప్రధానసందేశము. ఇష్టదేవతారాధనముచే నందఱకు మోక్షప్రాప్తియున్నది. హిందూమతమీ ధర్మమును గుర్తించుటయేకాదు. హిందూజాతి దైనికజీవితములో నీధర్మమాచరింపఁబడినది. ఒకే హిందూగృహములోఁదండ్రి అద్వైతియుఁ, దల్లి విష్ణుభక్తురాలును, కుమారుఁడు శివభక్తుఁడును, కుమార్తె కాళీభక్తురాలును గావచ్చును. ఈపరమపవిత్రధర్మము, భారతజాతిరక్తములో ప్రవహించినది; జాతీయజీవితపద్ధతిగా మారిపోయినది. కారణాంతరములచేఁ గొంతవఱకు నశించినను, నేటికి నీధర్మజ్యోతి ఒక్క హిందూజాతిలోనే ప్రకాశించుచున్నది.

నారాధించినను దోషము లేదు. ఆరాధకునిదృష్టి ననుసరించి, ఫలితము లభించును. ఉపనిషత్తులలో వ్యక్తిస్వాతంత్ర్యమును బోధించుమంత్రము లెన్ని యోగలవు.

## భగవద్గీతాసందేశము.

ఈ ఆధ్యాత్మికవ్యక్తి స్వాతంత్ర్యదివ్యగానము, భగవద్గీతలోఁ బ్రతిఅధ్యాయముననను, మధురాతి మధురముగా ఆలపింపఁబడినది. ఒకేసత్యమునకుఁ గల అనేకరూపములు పొందుటకుఁగల అనేకమార్గ ములు, వీనిని సమగ్రముగా సమన్వయించి, బోధించి నదే భగవద్గీతాదివ్యసందేశము. భక్తియోగములో అర్జునునకు మోక్షసిద్ధికి వలయు పెక్కుమార్గము లను చూపి, తనయిచ్ఛవచ్చినమార్గము నేరుకొను స్వాతంత్ర్యమును, శ్రీకృష్ణుఁడర్జునునిహస్తమునం దుంచినాఁడు. ఏమార్గమునను సరించినను సిద్ధిలభిం

అర్థము:—"అవ్యక్తబ్రహ్మను నారాధించు మనస్సుగలవారికిఁ గల కష్టమెక్కువైనది. దేహధారులకు, అవ్యక్తబ్రహ్మోపాసన దుఃఖమును కలిగించును.

"మనస్సు నాయందే ఉంచి, బుద్ధిని నాయందే లగ్నము చేయుము. అట్లుచేసిన, నాయందే నివసించెదవు. ఆవెనుక నే సంశయమును లేదు.

"నాయందు నీచిత్తమును స్థిరము గానుంచుశక్తి లేకున్నచో, అర్జునా, అభ్యాసయోగముచే నన్నాశ్రయింపుము.

"అభ్యాసముచేయుటకుఁ గూడ అసమర్థుఁడవైనచో, నాకు సమర్పణపూర్వకముగాఁ గర్మ చేయుము. నాకొఱకై నీవు కర్మచేసినచో నీవు సిద్ధిపొందఁగలవు

వాక్యములు పలికినాఁడు. ఇట్టి మహావాక్యములు ప్రపంచసారస్వతములో నెచ్చటనుకన్పట్టవు.

శ్లో. ఇతితేజ్ఞానమాఖ్యాతంగుహ్యాద్గుహ్యాతరంమయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసితథాకురు॥

"రహస్యాతిరహస్యమైన యీజ్ఞానము(Know-ledge of Truth) నాచే నీకు బోధింపఁబడినది. నిర్విశేషముగా దీనిని విమర్శించి, నీకేది నచ్చిన అదియే చేయుము." ఈ "యథేచ్ఛసి" శబ్దములో హిందూమతమందలి వర్ణనాతీతౌదార్యము, విశ్వవిశాలసమన్వయ భావము, అప్రతిమానముగా నిమిడియున్నవి.

## ప్రస్తుతహిందూజాతి.

దురదృష్టవశమున, నేటిహిందూజాతిలో మత శాఖలు, శాఖాంతరములు, లెక్కలేనన్ని బయలు దేరినవి. శాఖాదురభిమానము లేకున్నచో నెన్ని

చీలిక లను నీచక్రిమిసంఘములలోఁ జిచ్చుపెట్టి, దేశాంతరమునఁ గొట్లాడుచున్న జాతులమధ్య నీధర్మమును బోధించి, జాతిశ్రేయము, విశ్వశాంతియుఁ జేకూర్పవలసి యున్నది.



పరితాపము, సత్యారాధన సాధనము చేయుటలో భగవంతునిఁ జేరుటకుఁగల పద్ధతులలోఁ, బ్రతి వ్యక్తికిని గల దైవదత్తమైన సంపూర్ణస్వాతంత్ర్యము, నీరెంటినుండియు, నొకే సర్వేశ్వరునిఁ దెలియుటకు భిన్నమార్గములను ప్రేమతో సహించి, గౌరవించుట యను మూడవసిద్ధాంతము తప్పనిసరిగా వచ్చితీరును.

నాగృహమును నేను గాపాడుకొనుట యనఁగాఁ బరులయిండ్లకుఁ జిచ్చుపెట్టుటకాదు; నాజాతిశ్రేయ మును నేను కోరుటలోఁ బరజాతినాశనమును నే నపేక్షింపనవసరము లేదు; నాకు నా స్వదేశమందలి భక్తి యున్న, విదేశముల మంటఁగలపవలెనను దురూహజనింప నవసరము లేదు. నామతమును నేను ప్రేమించుట యనఁగా అన్యమతదూషణము కాఁజా లదు. నేను స్వాతంత్ర్యము ననుభవించుటకు, ఇతరు లను దాస్యశృంఖలములలో బంధింపనవసరము లేదు.

న్నాము. పుట్టుకచే మనము హిందువులమో, మహమ్మదీయులమో, వైష్ణవులమో, బౌద్ధులమో అని పించుకొనుచున్నారము. ఆచరణలోఁ బసిపిల్లలమై యున్న సంగతిని గుర్తింపము. "నీవేల హిందువు వన్న"చో "మాతాత హిందువు, మాతండ్రి హిందువు" నని బదులుచెప్పఁబడును. ఇట్టి పద్ధతులు మతములోఁజేరవు. నామములు, శాఖలు వీనికొఱకై కొట్లాడు మతములన్నియు నీపద్ధతులనుండియే బయలుదేరినవి. మనముచేయు కుత్రిమములను సమర్థింపఁగలిగినచో మనమతము ప్రయోజనము కలదని నమ్ముచున్నారము. దీనికొఱకై మనము కల్మష పూరితములగు నీచబుద్ధులతో హేతువులను, ప్రమాణములను ఉదాహరించుచున్నారము.

శబ్దప్రమాణము; హేతువాదము.

సక్రమమగు ఊహయే హేతువాదము. ఒకవిషయమునుగూర్చి చేసిన మనఆలోచనలను సమన్వ

ఆధారము. అనుభవజ్ఞానము, హేతురహితముకాదు హేతువునకతీతము. అందుచే, హేత్వాతీతస్థితిలో ననుభవపూర్వకముగా మహాత్ములు దర్శించి చెప్పిన సత్యములను మనము విశ్వసింపకతప్పదు. కాని యీ విశ్వాసముకూడ సహేతుకముగా నుండవలెను. గుడ్డినమ్మకము అవిశ్వాసముతోఁ దుల్యమైనదే. ఉపనిషత్తు చెప్పుచున్నది;

"నాయమాత్మా ప్రవచనేనలభ్యో, నమేధయా, నబహునాశ్రుతేన। యమేవైషవృణుతే, తేనలభ్య స్తస్యైష ఆత్మావృణుతే తనూగ్ స్వాం॥

"ఈపరమాత్మ, ప్రవచనమునకుఁగాని, బుద్ధికిఁగాని, వేదములనేకములు చదువుటవలనఁగాని, లభింపదు. ఎవనిచే వరింపఁబడునో వానిచేఁ బొందఁబడును. పరమాత్మయే స్వయముగా అట్టిసత్యాన్వేషకున కెఱుకపఱచుకొనును." (కఠ-ఉ-2-23.)

తెలియక, అనంతమగు అసంతృప్తిలోఁబడి, సత్యము
తెలియకున్న శాంతిలేదనినమ్మి, బుద్ధిచే సాధ్యమగు
కృషిసలిపి, కృషిఫలింపకపోవుటచేఁ, దిరిగి బయలు
దేరిన అసంతృప్తిసాగరములోనే పడకతీరదు. ఇట్టి
పరిస్థితిలో మానవులు మూడుపద్ధతులలోఁ బడుదు
రు. మొదటివారు నాస్తికవాదులు. మాబుద్ధికి గోచ
రింపలేను కాబట్టి భగవంతుఁడు లేఁడని వీరు వాదిం
తురు. రెండవతరగతివారు సంశయవాదులు. సత్య
ముమాకుఁ గన్పట్టలేదు. భగవంతుఁడున్న ఉండవ
చ్చును. మేముచూడని విషయములో నున్నాఁడని
కాని, లేఁడనికాని చెప్పఁజాలమని వీరివాదము.

కాని యీ రెండు వాదములు లోపముగలవే.
అసంతృప్తి యనుకార్చిచ్చుచేఁ గాల్పఁబడి, బయలు
దేరిన సత్యాన్వేషి, బుద్ధికీశ్వరుఁడు గానఁబడనంత
మాత్రమున, ఈశ్వరుఁడే లేఁడనుటసాహసము. అసం

## విశ్వాసపద్ధతి. (The Path of faith)

సరియగు సత్యాన్వేషకులకందఱకు ఒక్కమార్గముమాత్రమే మిగిలియున్నది. సత్యాన్వేషణములో సర్వసంగత్యాగమొనర్చి, పరమావధినిఁ జేరి, మహర్షులు, జ్ఞానులు, భక్తులు ప్రకటించిన సత్యములను మనమునమ్మి, ఆచరింపవలెను. అట్టి మహర్షులు బ్రహ్మానందమును రుచిచూచి, పలికిన పలుకుల భావము మనకిప్పుడు తెలియదు. వారు పలికినవాక్యములందు గౌరవముంచి, పరిపూర్ణవిశ్వాసముతో వానిని దైనికజీవితములో ననుష్ఠించి, సాధనముచేయుచుఁ బోయినచో, వారు చెప్పినసత్యము నిజమో కాదో తేలఁగలదు. అనేకులు మహర్షులు, గమ్యస్థానము చేరుట కనేక పద్ధతులను బోధించిరి. ఏపద్ధతియందు విశ్వాసముంచి, సాధనచేసినను, గమ్యస్థానము (Goal) ను జేరవచ్చునని వారు చెప్పుచున్నారు.

## బుద్ధిప్రయోజనము.

సత్యమందఱు కొకటే యని మనము చూచి యున్నారము. సత్యమును జేరుమార్గములు, దేశ కాల జాతిసాంప్రదాయముల భేదముచే, వివిధ ములై యుండక తప్పదనియు మనము తెలిసికొనియే యున్నారము. అందుచే అనేకమతములకు అవసర మున్నదని వేరుగాఁ జెప్పనక్కఱ లేదు. సత్యము నెఱుఁగవలెననెడి దాహము, సత్యమును, అందఱుప్రాణు లకు సమానమే. బుద్ధిమొదలగు ఇంద్రియములు, పరిమితములగుటచే, అపరిమితమగు సత్యమును గూర్చి, సమగ్రనిర్వచనమును జేయలేవనియు మన మెఱుఁగుదుము. అన్నితత్త్వశాస్త్రములును బుద్ధి నుండి పుట్టినవే కావున, అన్నియు అపరిపూర్ణములే. సత్యమును బుద్ధిచేఁ దెలిసికొనుట అసాధ్యమని ఋజువుచేయుటే మహోన్నతమగు తత్త్వశాస్త్ర

దరసమే. ఇది అతిసులభమైన విషయము. దీనిని గుర్తింపక, మానవజాతి ఆత్మద్రోహము చేసికొనుచున్నది.

## శ్రుతివచనములు.

"ఏకంసద్విప్రాబహుధావదంతి"

"సత్యమొకటే, విప్రులు బహువిధములఁ జెప్పుచున్నారు." (ఋగ్వేదము.)

"యథానద్యస్స్యందమానా స్సముద్రే అస్తంగచ్ఛంతి నామరూపేవిహాయ । తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరంపురుషముపైతిదివ్యమ్." (ముండకోపనిషత్తు. 111-2 8)

అర్థము:—ఏవిధముగాఁ, బ్రవహించుచున్ననదులు, నామరూపములను విడిచి, సముద్రములో లయమగుచున్నవో, ఆవిధముగానే, 'నామరూపముల వలన విముక్తుఁడైన విద్వాంసుఁడు పరాత్పరుఁడగు

త్మ ఒకటేయైనను, ప్రతిరూపమున కొక్కొకరూప మును పొందుచు, అన్నిరూపములకు బాహ్యముగఁ గూడనున్నది."

"యథాసౌమ్యైకేన మృత్పిండేన, సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్, వాచారంభణం వికారోనామ ధేయంమృత్తికేత్యేవసత్యం." (ఛాందో-ఉ-6-1-4)

"యథాసోమ్య, మధు మధు కృతోని స్తిష్ఠంతి, నానాత్యయానాం వృక్షాణాగ్ం రసాన్ సమవహార మేకతాగ్ం రసంగమయంతి." (ఛాందో-ఉ-6-9-1)

"స యఏషోఽణిమా-ఐతదాత్మ్యమిదగ్ంసర్వం, తత్సత్యగ్ంసఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ..." (ఛాందో-ఉ-6-9-4)

"అర్థము:—హేసోమ్య! ఏవిధముగా, ఒక్కమట్టి ముద్దవలన, మంటితోఁ జేయబడిన సమస్తము నెట్లు తెలియునో—ఎట్లు భేదములన్నియు మాటలచేఁ

యోగ కర్మయోగముల నెట్లు సమన్వయించుచు న్నదో—

శ్లో॥సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతినపండితాః
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతేఫలమ్॥
శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానంతద్యోగైరపిగమ్య తే। ఏకంసాంఖ్యంచ యోగంచ, యఃపశ్యతిసప శ్యతి॥ (గీత-అ. 5—4, 5)

అర్థము:—జ్ఞాన, కర్మయోగములు వేర్వేరని మూఢులు చెప్పుచున్నారు. జ్ఞానులట్లు చెప్పరు. జ్ఞాన, కర్మ, యోగములలో నే యొకదానిని లెస్సగా ఆశ్రయించినను, రెంటిఫలమును పొందుచున్నాఁడు.

జ్ఞానులచే నేస్థానము పొందఁ బడుచున్నదో, కర్మయోగులచే నదేస్థానముపొందఁబడుచున్నది. జ్ఞాన యోగమును, కర్మయోగమును ఒకటిగా (ఒకేఫల మునిచ్చువానినిఁగా) నెవఁడుచూచునో ఆతఁడే తెలి సినవాఁడు."

వివిధదేవతారాధనమును గూర్చి, శ్రీకృష్ణుఁడు వివేకులగు, తీవ్రసంస్కర్తలవలెఁగాక, అద్భుత సమన్వయవాక్యములనుపలికినాఁడు. ఈవాక్యములలో శ్రీకృష్ణభగవానుని సంపూర్ణదైవత్వము ప్రతిఫలించుచున్నది;

శ్లో॥ యేఽప్యన్యదేవతాభక్తాయజంతేశ్రద్ధయాన్వితాః
తేఽపిమామేవకౌంతేయ,యజంత్యవిధిపూర్వకమ్॥
(గీత—అ. 9-23)

"ఎవరుశ్రద్ధాన్వితులై, అన్యదేవతలనారాధించుచున్నారో, వారును విధినెఱుఁగక, (అప్రయత్నముగా) నన్నే యారాధించుచున్నారు."

"శ్లో॥ యోయోయాంయాంతనుంభక్తఃశ్రద్ధయార్చితుమిచ్ఛతి। తస్యతస్యాచలాం శ్రద్ధాంతామేవవిదధామ్యహం॥
(గీత. 9-25.)

"శ్లో॥ నబుద్ధిభేదంజనయేదజ్ఞానాంకర్మసంగినాం।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమా
చరన్ ॥ (గీత. అ. 3-26.)

పండితుఁడగువాఁడు, కర్మసంగులైన అవివేకుల బుద్ధియందుఁ జలనమును గలిగింపరాదు. అట్టిపండితుఁడు, తానునిష్ఠాపరుఁడై కర్మలను జేయుచు, నితరులచేఁ జేయింపవలెను."

"శ్లో॥ యేయథామాంప్రపద్యంతేతాంస్తథైవభజామ్యహం। మమవర్త్మానువర్తంతే, మనుష్యాః పార్థ
సర్వశః॥

(గీత. అ. 4-21.)

హేఅర్జునా! ఎవరు, ఏవిధముగా నన్ను అర్చన చేయుదురో, వారినావిధముగానే నేననుగ్రహింతును. అన్నివిధములచేతను మనుష్యులు, నామార్గమునే అనుసరించుచున్నారు."

ము, ఒక్కొక్క యీశ్వరారాధనమార్గము. కాని అన్ని పుష్పములలోఁ దేనెయున్నది; అన్ని పుష్పములలోని తేనెయు నొకేమాధుర్యము నొసఁగును. హిందూమతమహావనములోనికరిగి, ఏలతాగ్రమునువంచినను, పుష్పము లభించుచు; దివ్యసౌరభముదొరకును; మకరందామృత మూటలూరును. ఒకటిమాత్రమున్నది. జాజిపువ్వులోని తేనెనాని, మల్లెపువ్వులోఁ దేనె లేదనికాని, విషమున్నదనికాని అనుట, అజ్ఞానము, మౌఢ్యము, దౌర్జన్యమునని మాత్రముగుర్తించినచో బాధలేదు. ఓపికయున్నచో, తేనెటీగవలె, అన్ని పువ్వులమకరందమునుగాంచును. తేనెటీగమాత్రము తెలివి యున్నచో జాతి స్వాభిమాన పిశాచము, స్వమతదురహంకార భూతము, వేధించుట మానును. జాతులకు, సంఘములకు సుఖజీవనము లభించును.

నానామణి గర్భిత మహాసాగరము.

హిందూమతము, దరిలేని మహాసముద్రము. ఆసముద్రగర్భమునఁ అన్నిజాతులమణులు, రత్నములు, గుట్టలుగుట్టలుగాఁ బడియున్నవి. ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము; కర్మ, భక్తి, జ్ఞాన, యోగములు; కృష్ణ, రామ, విష్ణు, శివులు; నిర్గుణ, నిరాకార బ్రహ్మారాధనము, సగుణసాకార బ్రహ్మార్చనము; మున్నగునవన్నియుఁ బెక్కురకముల తళతళలతోఁ బ్రకాశించుచున్న మణిరాజములు. ప్రతిమణియు, ప్రతిప్రాణికి, బ్రహ్మజ్ఞానకాంతి నొసగు చింతామణియే. అంధకారమునఁ బడి, అల్లాడుచున్న జీవాత్మకు, సంసారసాగరములోఁ దెన్నుచూపుటకేమణియైనను వినియోగించును. ఏమణినాశ్రయించి, జీవి నట్టిఁటఁ బెట్టుకొన్నను సూర్యచంద్రాదులకాంతి చీకటియైపోవు, వర్ణింపఁజాలవికాని పరంజ్యోతియొద్దకు

సోదరభావమును, సామరస్యమును, పరస్పరవాత్స ల్యమును, కూకటివ్రేళ్లతోఁ గూల్చివైచినవి. ఈక్షమింపరాని పక్షపురభిమానమును, అన్నిరంగముల నుండి, రాజకీయ, సాంఘిక, ఆర్థికాది సనుస్తరంగ ములనుండి తఱిమివేయుఁడు. ఏలన, మతము అన్ని రంగములను పావనమొనర్పవలసి యున్నది.

సర్వజాతి సోదరులకును హిందూమతము, ఈ దివ్యసందేశమును పూరించుచున్నది.

"ప్రేమనిలయులగు సోదరులారా! మనకందఱకు మూడుపనులుచేయుటకు మాత్రమే హక్కున్నది. ప్రతిప్రాణియు, జీవితసమస్యను పరిష్కరించుకొన వలయు అవసరమును గుర్తించుటకై, మేలుకొను మని, ప్రేమగీతములతో మేలుకొలుపుచు పాడుఁడు; ప్రతిప్రాణియు, సత్యారాధన మార్గములో, అనేక ములగు వ్యక్తిఉపాధుల ననుసరించి, తనకనుగు

ణమగు మార్గమునుబట్టి పరమావధిని జేరుటకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసఁగుఁడు; తెంపులేని అమోఘమగు సత్యకాంక్షయున్న నాఁడు అన్నిమార్గములు, అన్నిమతములు, నొకే పరమాత్మసాన్నిధ్యమునకుఁ దోడ్కొనిపోవ సమర్థములని అంగీకరించి, మతములలోని భిన్నత్వమును, అనేకత్వమును ప్రేమతో, వాత్సల్యముతో, గౌరవముతో సహింపుఁడు. ఈనూఁడుపనులే ప్రతివ్యక్తియొక్కయు, ప్రతిజాతియొక్కయు స్వధర్మము. ఈస్వధర్మమే ఈశ్వరధర్మము. దీనికడ్డువచ్చు ఆటంకములను తొలగించుటకు అవసరమగుచో సంపూర్ణత్యాగమునకు సంసిద్ధులైయుండు వ్యక్తులున్నచో అప్పుడే ...కల్యాణము, లోకకల్యాణముచేకూరి, రాష్ట్రసత్వ

ముచే దుఃఖదూషితమై, పలవించుచున్న యీభూ-
మండలము దైవకాంతులచే వెల్లివిరిసి, నిత్యానంద
ముచే బవిత్రమై, శాశ్వతశాంతి నిలయమగును.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.



## 1. శ్రీ వివేకానందస్వామి జీవితము.

500 పుటలు, 2 భాగములు. భాగము 1 కి రు 0-12-0 ఖరీదు. పత్రికలన్నియు విశేషముగా ప్రశంసించినవి. వలయువారు:- శ్రీ రామకృష్ణపూజామందిరము, కొత్తపేట గుంటూరు అనివ్రాయవలెను.

## 2. శ్రీ రామతీర్థస్వామి జీవితము.

150 పేజీలు. వెల రు 0-8-0 మాత్రమే.

"ఈమహనీయుని జీవితము నిదివఱకెవరును తెలుగులో వ్రాయనిలోటును ఇపుడు వేంకటేశ్వర్లు గారు తీర్చిరి. రామతీర్థస్వామి జననము మొదలు నిర్యాణమువఱకును 28 శీర్షికలక్రింద సులభవచనమున నీగ్రంథములో వివరింపబడెను. ఇది ముఖ్యముగా చదువదగినది."—ఆంధ్రపత్రిక.

"సులభమై, ముద్దులుమూటగట్టు శైలిలో వ్రాయబడిన యీగ్రంథమును చదువుటే ఆహ్లాదకరము."—హిందూపత్రిక.

3. [illegible] రాధాకృష్ణ[illegible] జీవిత పరమార్థ

దృక్పథము."

78 పేజీలు, డెమ్మీ. వెల రు. 0-6-0 మాత్రమే.

"శ్రీయుత బులుసు వెంకటేశ్వర్లుగారిచే ఆంధ్రములో సంగృహీతమైన 'నాజీవితపరమార్థ దృక్పథము'ను నేనానందముతో దిలకించినాను. ఈగ్రంథమాంధ్రలోకమున కామోదమొనగూర్చునని విశ్వసించుచున్నాను. మఱియు నీప్రయత్నము ఈ యనువాదకుల కాంధ్రభాషయందుగల అధికారపాండిత్యమునే కాక, మతాభిమానాభినివేశములను సహితము సువ్యక్తము చేయుచున్నది."- స. రాధాకృష్ణ.

2, 3. గ్రంథములకు,

బులుసు వెంకటేశ్వర్లుగారు ఎం. ఎ,.

[illegible] కాలేజీ, కాకినాడ.